# ఒకటవ తరగతి వాచకం

*సంశోధకులు :*
శ్రీమతి. బి.యం. కుసుమ కుమారి
శ్రీమతి డాక్టర్ బి. సరోజన
శ్రీమతి వి. రత్నమాల

*ప్రధాన సంపాదక మండలి :*
*అధ్యక్షులు :* ఆచార్య కె. కె. రంగనాధాచార్యులు
ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి
డా॥ ఏ. ఏ. యల్. నరసింహా రావు
డా॥ అంతటి నరసింహం

*చిత్రకారుడు :*
శ్రీ గోలి శివరామయ్య

*ముఖచిత్రం :*
జగదీష్ జోషి





ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ
హైదరాబాదు

# ముందుమాట

ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం ప్రాథమిక విద్యా బోధనను పటిష్టపరచడానికి, బోధనాభ్యాసనంలో గుణాత్మకతను పెంపొందించడానికి, విద్యార్థి కేంద్రీకృతంగా, కృత్యాధార బోధనకు అనువైన అంశాలను ఎంపిక చేసుకోవడం లక్ష్యంగా అభిరుచికరమైన, ఆకర్షణీయమైన, పరిసరానుగుణ్యమైన, స్థానిక వనరుల ప్రాధాన్యంగా ఆనందదాయకమైన అభ్యసనకు తోడ్పడే విధంగా ఒకటవ తరగతి వాచకాన్ని తయారు చేయడానికి నిర్ణయం తీసుకొంది.

1986 జాతీయ విద్యా విధానాన్ని అనుసరించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పాఠ్య ప్రణాళిక మార్గదర్శక సూత్రాలకు లోబడి వాచకాల బాహ్య స్వరూపం, నిర్వహణ, విషయం, విషయ ప్రదర్శన మొదలైన వాటిని దృష్టియందుంచుకొని అనుభవజ్ఞులైన ప్రాథమిక ఉపాధ్యాయులు, జిల్లా విద్యాశిక్షణా సంస్థలలోని ఉపన్యాసకులు, వివిధ సంస్థల విషయనిపుణులచే వాచకం తయారు చేయబడింది.

వాచకాన్ని నవసమాజనిర్మాణం, జాతీయ విలువలు, సామాజిక విలువలు, మానవతా విలువల్ని పెంపొందించడం ప్రాతిపదికగా మారుతున్న సమాజానికి తగినట్లుగా పురోగమించుటకు విద్యార్థులలో దేశభక్తి, భూతదయ, సత్కార్యాచరణ, ధైర్యసాహసాలు, సృజనాత్మకత, పఠనాసక్తులను కలిగించుటకు దోహదకారిగా ఉండేటట్లు రూపొందించడం జరిగింది. ప్రాథమిక విద్యలో భాషా నైపుణ్యాలు సంపాదించుటకవసరమైన శ్రవణ, పఠన, లేఖనాలపై విద్యార్థులు ఆధిపత్యాన్ని కలిగి ఉండేటట్లుగా నిర్దిష్ట కనీస అభ్యసన స్థాయిలను పరిగణనలోనికి తీసుకోవడం జరిగింది.

ఈ విధంగా తయారైన వాచకాన్ని ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలో ఎంపిక చేయబడ్డ 52 ప్రాథమిక పాఠశాలల్లో ప్రయోగాత్మకంగా 1994-95లో ప్రవేశ పెట్టడం జరిగింది. దీనిపై విద్యార్థుల, ఉపాధ్యాయుల, పర్యవేక్షకుల, తల్లిదండ్రుల అనుభవాలను, సాధనలను, అభిప్రాయాలను సేకరించి, విశ్లేషించి, మూల్యాంకనం చేసి సంశోధిత ముద్రణను తయారు చేయడం జరిగింది.

ఈ వాచకం తయారీలో, పాఠ్యక్రమరూపకల్పనలో కింది పద్ధతులను పాటించడం జరిగింది.

- ఉపాధ్యాయులు ప్రతిదినం పిల్లలచే చెప్పించవలసిన "ప్రతిజ్ఞ" ముందుగా పొందుపరచడం.
- దేశభక్తిగేయాలు : వందేమాతరం, మా తెలుగుతల్లి, సారే జహాఁసే అచ్ఛా, జనగణమన గీతాలు ఉపాధ్యాయులు పాడి వినిపించి విద్యార్థులందరూ పాడేటట్లు చేయడానికి ముందుపేజీలలో వాటిని ప్రచురించడం.
- విషయసూచికలో ఆయా పాఠాల వివరాలు చేర్చడం.
- వర్ణమాలలో అక్షరక్రమం ప్రకారం పిల్లలు, పెద్దలు, సహజంగా వాడే పదాల పొందికతో పాఠాలను తయారుచేయడం.
- ప్రతి అక్షరానికి ఆకర్షణీయమైన రంగుల బొమ్మలు/చిత్రాలు వాటికి సంబంధించిన పదాలు పొందుపరచడం.
- సాధ్యమైనంతవరకు ప్రతి అక్షరానికి రాగ, తాళయుక్తమైన గేయాన్ని రాయడం.
- అక్షరాలకు తగిన చిన్న చిన్న పదాలు, చిత్రాలు కూర్చి అభ్యసన, పునరభ్యసనకు అవకాశం కల్పించడం.

- అక్షరాలను సులభంగా రాయడానికి తగిన మెలకువలను సూచించడం, లేఖనాభ్యసనకు దోహదం కల్పించడం.
- గుణింతాలను క్రమపద్ధతిలో ఆకర్షణీయమైన చిత్రాలతో అభిరుచికరమైన పదాలతో ప్రవేశపెట్టడం.
- పై తరగతిలో ద్విత్వ, సంయుక్తాక్షరాలను నేర్చుకొనుటకు ప్రాతిపదికగా ద్విత్వాక్షరాలను కొన్నింటిని ప్రవేశపెట్టడం.
- తేలిక మాటలతో ఉన్న ఒకటి రెండు గేయాలను వాచకం చివరిలో చేర్చడం.
- దైనందిన జీవితంలో ఉపయోగంలో లేని అక్షరాలు, ఙ, చే, జే, ఞ అర్థానుస్వారం, విసర్గలు తప్ప వర్ణమాలలోని అక్షరాలను పిల్లలు నేర్చుకునేటట్లు చేయడం.

ఉపాధ్యాయులకు ఈ వాచక రచనా విధానం, బోధనా పద్ధతి సులభగ్రాహ్యమే అయినను అధ్యాపక దర్శినిలో బోధనాభ్యసన కృత్యాలు మరిన్ని వివరాలతో సూచనలు ఇవ్వబడ్డాయి. ఎంతటి మంచి పాఠ్యపుస్తకమైనను ఉపాధ్యాయునికి దీటురాదు. ఉపాధ్యాయులు ఈ పుస్తకరచనలోని లక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని తమ అనుభవాలను జోడించి, స్థానిక వనరులను వినియోగించి, ఆకర్షణీయమైన బోధనోపకరణాలను తయారు చేసి, చేయించి, సేకరించి విద్యార్థులలో అభ్యసన పట్ల ప్రేరణ కలిగించాలి. ప్రతి విద్యార్థి కనీసాభ్యసన స్థాయిలను సాధించేటట్లు చూడాలి.

ఈ వాచకంపై అభిప్రాయాలను, సలహాలను పాఠశాల విద్యాకమీషనరు మరియు సంచాలకుల వారికి పంపించవలసినదిగా మనవి.

## ఈ వాచక రచనలో ఈ క్రింది అనుభవజ్ఞులు పాల్గొన్నారు.

| | | |
|---|---|---|
| డాక్టరు బ్రిజిడ్ స్మిత్ | - | సలహాదారులు-కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ భాషానిపుణులు. |
| శ్రీ టి. కుమారస్వామి శెట్టి | - | ప్రధానోపాధ్యాయుడు పురపాలక ప్రాథమిక పాఠశాల, భాజీవీధి, చిత్తూరు, చిత్తూరు జిల్లా. |
| శ్రీమతి బి. సుజాతా శేఖర్ | - | ఉపాధ్యాయిని, మం.ప. పాఠశాల, దేవరకొండ, నల్లగొండ జిల్లా. |
| శ్రీ దీవి రంగాచార్యులు | - | ఉపాధ్యాయుడు, ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాల, స్వర్ణ, ప్రకాశంజిల్లా. |
| శ్రీ ముదికొండ శాస్త్రి | - | ఉపాధ్యాయుడు, ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాల, ఎలకుర్రు, కృష్ణా జిల్లా. |
| శ్రీమతి సత్యగీత | - | ఉపాధ్యాయిని, మం. ప. ప్రాథమిక పాఠశాల, దువ్వాడ, విశాఖపట్నం జిల్లా. |
| శ్రీ పి. రామకోటేశ్వరరావు | - | ఉపాధ్యాయుడు, మం. ప. ప్రాథమిక పాఠశాల, నూజివీడు, కృష్ణా జిల్లా. |
| శ్రీమతి ఎన్. సుభద్ర | - | ఉపాధ్యాయిని, మం.ప. ప్రాథమిక పాఠశాల, దొమ్మేరు, పశ్చిమగోదావరి జిల్లా. |
| శ్రీమతి కె. కోటేశ్వరమ్మ | - | ఉపాధ్యాయిని, మం.ప. ప్రాథమిక పాఠశాల, మలయప్పన్నపేట, కృష్ణా జిల్లా. |

| | | |
|---|---|---|
| శ్రీ పి. సాంబయ్య | - | ఉపాధ్యాయుడు, మం.ప. ప్రాథమిక పాఠశాల, కందుకూరు, ప్రకాశం జిల్లా. |
| శ్రీ యం. తిరుపతయ్య | - | ఉపాధ్యాయుడు, అభ్యుదయ ప్రాథమికోన్నత పాఠశాల, అచ్చంపేట, మహబూబ్‌నగర్ జిల్లా. |
| శ్రీమతి టి. సిద్దమ్మ | - | ఉపాధ్యాయిని, మం.ప. ప్రాథమిక పాఠశాల, కృష్ణానగర్, కల్లూరు మండలం, కర్నూలు జిల్లా. |
| శ్రీమతి కొత్త శోభ | - | ఉపాధ్యాయిని, కేంద్ర ప్రాథమిక పాఠశాల, జనగాం, వరంగల్లు జిల్లా. |
| శ్రీ యం. నర్సింహులు | - | ఉపాధ్యాయుడు, మం.ప. ప్రాథమిక పాఠశాల, అరవపల్లి, నందలూరు మండలం, కడపజిల్లా. |
| శ్రీ వి. సోమలింగం | - | ప్రధానోపాధ్యాయుడు, మం.ప. ప్రాథమిక పాఠశాల, ప్రేమావతిపేట, రంగారెడ్డి జిల్లా. |
| శ్రీ యస్.వి.వి.యస్. శర్మ | - | ఉపాధ్యాయుడు, మం.ప. ప్రాథమిక పాఠశాల, నక్కపల్లి, విశాఖపట్టణం జిల్లా. |
| శ్రీ ఎ. రామచంద్రుడు | - | మండల విద్యాధికారి, నక్కపల్లి మండలం, విశాఖపట్టణం జిల్లా. |
| శ్రీ జె. మధుకర్ | - | సీనియర్ ఉపన్యాసకులు, జిల్లా విద్యాశిక్షణా సంస్థ, వరంగల్లు. |
| శ్రీ నీలకంఠరావు | - | సీనియర్ ఉపన్యాసకులు, జిల్లా విద్యాశిక్షణా సంస్థ, ఆదిలాబాదు. |
| శ్రీ కె. మహాదేవరెడ్డి | - | సీనియర్ ఉపన్యాసకులు, జిల్లా విద్యాశిక్షణా సంస్థ, నిజామాబాదు. |
| శ్రీ ఎస్.బి.జె.ఆర్. చౌదరి | - | ఉపన్యాసకులు, జిల్లా విద్యాశిక్షణా సంస్థ, గుంటూరు. |

**విషయ నిపుణులు**

| | | |
|---|---|---|
| డా॥ సి. రామచంద్రరావు | - | రీడరు, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు. |
| శ్రీ జి. వెంకటస్వామి | - | ఉపన్యాసకులు, ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం, హైదరాబాదు. |
| శ్రీ యస్. నారాయణరావు | - | ఉపన్యాసకులు, ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం, హైదరాబాదు. |
| శ్రీమతి డి. అరుణాదేవి | - | ఉపన్యాసకులు, జిల్లా విద్యాశిక్షణా సంస్థ, నేరేడ్‌మెట్, హైదరాబాదు. |
| డా॥ ప్రమీలా రెడ్డి | - | ఉపన్యాసకులు, తెలుగు అకాడమి, హైదరాబాదు. |

## ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం - అభ్యసన సూత్రాలు

అ. ఉపాధ్యాయులు రూపొందించిన అభ్యసన ప్రక్రియలను కల్పించటం.

ఆ. క్రియలు, అన్వేషణ, ప్రయోగాల ద్వారా అభ్యసనాన్ని అభివృద్ధి పరచటం.

ఇ. వ్యక్తిగత, జట్టు, పూర్తి తరగతి పనిని అభివృద్ధి పరచటం.

ఈ. వైయక్తిక భేదాలకు తగిన అభ్యసనాన్ని కల్పించటం.

ఉ. స్థానిక పరిసరాలను వినియోగించటం.

ఊ. విద్యార్థుల పనిని ప్రదర్శించి, చక్కగా నిర్వహించటం ద్వారా ఆసక్తికరమైన తరగతిగదిని రూపొందించటం.

# వందే మాతరం

- బంకించంద్ర ఛటర్జీ

వందేమాతరం

సుజలాం సుఫలాం మలయజ శీతలాం

సస్య శ్యామలాం మాతరం వందేమాతరం

శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం

ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం

సుహాసినీం సుమధుర భాషిణీం

సుఖదాం వరదాం మాతరం వందేమాతరం

**భావం :** భారతమాతకు వందనం. తియ్యని నీటితో, కమ్మని పండ్లతో, చల్లని గాలులతో, పచ్చని పైరుతో విలసిల్లే భారతమాతకు వందనం. రాత్రులు తెల్లని వెన్నెలతో పులకిస్తూ విరబూసిన చెట్లతో శోభిస్తూ స్వచ్ఛమైన నవ్వులతో మధురమైన మాటలతో మాకు సుఖాలు కలిగిస్తూ వరాలనిచ్చే భారతమాతకు వందనం.

**ఉపాధ్యాయులకు సూచన :**

స్వాతంత్ర్య సమరంలో వందేమాతరం గీతం యావద్భారత దేశాన్నీ ఉర్రూత లూగించింది. దీన్ని స్వాతంత్ర్య విప్లవగీతంగా భారతీయులందరూ గానం చేశారు. ఇది బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా సింహగర్జనలా మారుమోగింది. దేశభక్తికీ, స్వాతంత్ర్య పిపాసకూ ఈ గీతం ప్రతీకగా నిలచింది. ఈ గీతం బంకించంద్ర ఛటర్జీ రాసిన "ఆనంద్ మఠ్" నవలలోనిది. ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి. భావం చెప్పాలి.

- శంకరంబాడి సుందరాచారి



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం - నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లి ! జై తెలుగు తల్లి !

# సారే జహాఁసె అచ్ఛా

- మహ్మద్ ఇఖ్బాల్

సారే జహాఁసె అచ్ఛా హిందూస్తాఁ హమారా
హమ్ బుల్ బులేఁహై ఇస్‌కే, యే గుల్ సితాఁ హమార హమారా ॥

పరబత్ వో సబ్ సే ఊంఛా హమ్‌సాయా ఆస్మాఁ కా
వో సంతరీ హమారా ! వో పాస్‌బాఁ హమార హమారా ॥

గోదీమె ఖేల్‌తీహైఁ ఇస్‌కీ హజారోఁ నదియాఁ
గుల్‌షన్‌హై జిన్ కే దమ్‌సే రష్ కే జినాఁ హమార హమారా ॥

మజ్-హబ్ నహీఁ సిఖాతా ఆపస్‌మె బైర్ రఖ్‌నా
హిందీ హైఁ హమ్ హిందీ హైఁ హమ్
హిందీ హైఁ హమ్ వతన్ హై హిందుస్తాఁ హమార హమారా ॥

భావం : ప్రపంచంలో కెల్లా మన భారతదేశం ఉత్తమమైంది. ఇది మనకో ఉద్యానవనం, మనమిక్కడ బుల్ బుల్ పిట్టలం. ఆకాశాన్నంటే ఆ మహోన్నత పర్వతం ఆ పక్కన మనకు కాపలాగా రక్షణగా నిలచి ఉంది. ఈ దేశమాత ఒడిలో వేలాది నదులు ఆడుకుంటున్నాయి. ఈ నదీ జలాలతో వికసించిన పూదోటను చూసి స్వర్గమే అసూయ పడుతున్నది. మతం, పరస్పర వైరాన్ని బోధించదు. మనమంతా భారతీయులం. మనదేశం భారతదేశం.

ఉపాధ్యాయులకు సూచన :

ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి.

# జాతీయ గీతం

- రవీంద్రనాథ్ టాగూరు

జనగణమన అధినాయక జయహే !
భారత భాగ్య విధాతా !
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగ !
వింధ్య, హిమాచల, యమునా, గంగ,
ఉచ్ఛల జలధితరంగ !
తవ శుభనామే జాగే !
తవ శుభ ఆశిష మాగే !
గాహే తవ జయ గాథా !
జనగణ మంగళదాయక జయహే
భారత భాగ్యవిధాతా !
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !

**భావం :** జనులందరి మనస్సులకూ అధినేతవు, భారత భాగ్య విధాతవు అయిన నీకు జయమగుగాక. పంజాబు, సింధు, గుజరాత్, మహారాష్ట్ర, ద్రావిడం, ఉత్కళ, వంగ దేశాలతోను, వింధ్య హిమాలయ పర్వతాలతోను, యమునా గంగా ప్రవాహాలతోను ఉవ్వెత్తుగా లేచే సముద్ర తరంగాలతోను శోభించే ఓ భారత భాగ్య విధాతా ! వాటికి నీ శుభనామం ఉద్బోధ కలిగిస్తుంది. అవి నీ ఆశీస్సులు అర్థిస్తాయి. నీ జయగాథల్ని గానం చేస్తాయి. సమస్త జనులకూ మంగళ ప్రదాతవు, భారత భాగ్య విధాతవు, అయిన నీకు జయమగుగాక! జయమగుగాక! జయమగుగాక !

**ఒక వివరణ :** ఈ గీతం అవిభక్త భారతదేశంలోని రాష్ట్రాలను సూచిస్తుంది. సింధుప్రాంతం ఇప్పుడు పాకిస్తాన్‌లో ఉంది. మరాఠా అంటే మహారాష్ట్రం. ద్రావిడ అంటే తెలుగు, తమిళ, కర్ణాటక, కేరళ ప్రాంతాలు. ఉత్కళ అంటే ఒరిస్సా, వంగ అంటే ఇప్పటి పశ్చిమ బెంగాలు.

# ప్రతిజ్ఞ

భారతదేశం నా మాతృభూమి. భారతీయులందరూ నా సహోదరులు. నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వసంపద నాకు గర్వకారణం. దీనికి అర్హత పొందడానికి సర్వదా నేను కృషి చేస్తాను.

నా తల్లిదండ్రుల్ని, ఉపాధ్యాయుల్ని, పెద్దలందర్ని గౌరవిస్తాను. ప్రతివారితోను మర్యాదగా నడచుకొంటాను.

నా దేశంపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందానికి మూలం.

# విషయసూచిక

# అ





అమ్మ అరటిపండు తెచ్చింది.
అమలకు ఇచ్చింది.
అయ్య అరకతో వచ్చాడు.
అరుగుమీద పెట్టాడు.



అరటి



అరక



అల

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| అన్న | అక్క | అత్త | అటక |

కింది చుక్కలను కలపాలి.

అ



ఆ



నాలుగు కాళ్ళ జంతువును
తియ్యటి పాలు ఇస్తాను
అంబా అంబా అంటాను
ఎవరినీ? నేనెవరినీ ?


ఆకు


ఆట

ఈ పదాలు పలకాలి.

| | | |
|---|---|---|
| ఆమడ | ఆవాలు | ఆరామం |

కింది చుక్కలను కలపాలి.

ఆ

# ఇ



ఇదిగో ఇదిగో మా ఇల్లు
ఇటుకల ఇల్లే మా ఇల్లు
పిల్లా పాపల మా ఇల్లు
సరదాలాడే మా ఇల్లు



ఇల్లు



ఇటుక

ఈ పదాలు చదవాలి.

| | | | |
|---|---|---|---|
| ఇసుక | ఇరుసు | ఇనుము | ఇంగువ |

కింద చుక్కలను కలపాలి.





# ఈ



ఇదిగో ఈతచెట్టు.
ఈతపళ్ళు రాలాయి.
ఈతపళ్లపై ఈగలు వాలాయి.
ఈలలు వేస్తూ బాలలు వచ్చారు.
ఈగలు వాలిన పళ్ళను తిన్నారు.
ఆపై బాధలు ఎన్నో పడ్డారు.



ఈగ



ఈక



ఈల

ఈ పదాలు పలకాలి.

| ఈటె | ఈనె | ఈత | ఈదర |
|---|---|---|---|

కింది చుక్కలను కలపాలి.









# ఉ



ఉడతా ఉడతా ఊచ్ !
ఎక్కడ ఉన్నావోచ్ ?
ఉసిరి చెట్టు మీదోచ్ !
ఎందుకు ఎక్కావోచ్?
ఉసిరికాయలకోచ్ !
ఉసిరికాయలెందుకోచ్?
ఉమకిచ్చేటందుకోచ్ !


ఉల్లి


ఉడత


ఉంగరం

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| ఉప్పు | ఉన్ని | ఉరుము | ఉలవలు |

కింది చుక్కలను కలపాలి.




# ఊ

ఏడవకు ఏడవకు నా బుజ్జి తల్లీ
ఊరుకో నా తల్లి ఊరుకోవమ్మా!
ఊరెళ్లి మీ నాన్న బొమ్మ తెచ్చాడు
ఊరుకొని బొమ్మతో ఆడుకోవమ్మా!

ఊడ ఊరు ఊయల

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| ఊక | ఊచ | ఊట | ఊపు |

కింది చుక్కలను కలపాలి.

ఊ

# ఋ


వసంత ఋతువు


గ్రీష్మ ఋతువు


వర్ష ఋతువు


శరదృతువు


హేమంత ఋతువు


శిశిర ఋతువు

ఈ పదాలు పలకాలి.

| | |
|---|---|
| ఋణం | ఋషి |

కింది చుక్కలను కలపాలి.

ఋ

# ఏ



ఏమి బొమ్మ? ఏనుగు బొమ్మ
ఏమి కాయ? ఏలక్కాయ
ఏమి దారం? ఏకుల దారం
ఏమి గట్టు? ఏటి గట్టు



ఏడు 7



ఏతం



ఏనుగు

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| ఏరు | ఏది | ఏలూరు | ఏకులు |

కింది చుక్కలను కలపాలి.





# ఐ



ఐసుక్రీం చల్లన
ఐరావతం తెల్లన
ఐదు వేళ్లు చేతికి
ఐకమత్యం మంచికి



ఐదు



ఐరావతం



ఐసుక్రీం

ఈ కింది వాక్యంలో 'ఐ' ని గుర్తించాలి.

ఐదుగురు ఐదు ఐసుముక్కలు కొన్నారు.

కింది చుక్కలను కలపాలి.





# ఒ



ఒదిగింది పాపాయి
ఒడిలోన చల్లగా
ఒక్క కథ చెప్పమని
ఒప్పుగా అడిగింది

| | | |
|---|---|---|
|  ఒర | 1 ఒకటి |  ఒంటె |

ఈ పదాలు పలకాలి.

| | | |
|---|---|---|
| ఒడి | ఒప్పు | ఒకడు |

కింది చుక్కలను కలపాలి.

ఒ

# ఓ



ఓనమాలు నేర్చుకో
ఓరిమితో చదువుకో
ఓర్పు నేర్పు ఉంటే
ఓటమి లేదని తెలుసుకో



ఓడ



ఓటు

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| ఓపిక | ఓటమి | ఓరిమి | ఓనమాలు |

కింది చుక్కలను కలపాలి.





AG

# ఔ



ఔట్లు పేల్చే దీపావళి
అందమయిన దీపావళి
వెలుగుల పండుగ దీపావళి
ఔనిది ఔనిది దీపావళి



ఔటు



ఔషధం

ఈ పదాలు పలకాలి.

| | | |
|---|---|---|
| ఔను | ఔరా! | ఔనౌను! |

కింది చుక్కలను కలపాలి.

ఔ



# అం

అందమయిన చందమామ
అందుకోను వీలుకాదు
అందరాని చందమామ
అందరికీ కావాలి



అందె



అంగడి



అంబ

ఈ పదాలు పలకాలి.

| | | |
|---|---|---|
| అందం | అందరం | అంబలి |

కింది చుక్కలను కలపాలి.





# క



చిలుక, పిచ్చుక, ఎలుక, జింక కలసి ఉండేవి
ఒకనాడు జింక వలలో పడింది.
చిలుక, పిచ్చుక చూశాయి.
ఎలుకను తీసుకొని వచ్చాయి.
తరవాత ఏమయింది ?





కడవ



కప్ప



కలం

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| కథ | కవి | కంకి | కన్ను |

కింది చుక్కలను కలపాలి.

క





# గ

గలగలా పారింది గంగ
గబగబా వచ్చింది మంగ



గద



గంప



గడప

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| గజగజ | గడగడ | గణ గణ | గరగర |

ఇచ్చిన అక్షరాలతో మాటలు రాయాలి.

క
గ ఈ
ఊ ఒ

| | |
|---|---|
| | |
| | |

పై బొమ్మలను చూసి ఈ కింది ఖాళీలను నింపాలి.

............ద ............ంప ............డప

కింది చుక్కలను కలపాలి.





# చ



ట్రాలీ బండికి
**చ**క్రం ఒకటి



ఎద్దుల బండికి
**చ**క్రాలు రెండు



రిక్షాకు **చ**క్రాలు
మూడు



బస్సుకు **చ**క్రాలు
నాలుగు



రైలుకు **చ**క్రాలు
ఎన్నో!



**చ**క్రం



**చ**ందమామ



**చ**దరం

ఈ పదాలు పలకాలి.

| | | | | |
|---|---|---|---|---|
| చక్కెర | చక్కన | చనువు | చమురు | చలి |

ఈ బొమ్మలు చూసి మాటలు చెప్పాలి.





కింది చుక్కలను కలపాలి.

చ



# జ



జలజ పూలు తెచ్చింది.
అల్లుకొని జడలో పెట్టుకొంది.
జమున వచ్చింది. జంటగా గుడికి వెళ్ళారు.
జలజ, జమున ఎప్పుడూ జగడాలాడరు.
కలిసిమెలిసి జతగా ఉంటారు.


జట్కా


జంట


జల్లెడ

బొమ్మలను చూసి ఖాళీలను నింపాలి.


...........త


...........డ

కింది చుక్కలను కలపాలి.





# ట

టపటప వానకురిసింది
టమాటా తోట పండింది
టక్కరి నక్క చూసింది
టమాటాను కసకస కొరికింది
టముకు డమడమ మోగింది
టక్కున నక్క ఉరికింది



టమాటా



టముకు



తోట

ఈ పదాలు పలకాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆట | పాట | బాట | మాట | కటకట | పటపట |

కింది చుక్కలను కలపాలి.





# డ



రవీ! ఏమిటి **డ**బ**డ**బ ?

**డ**బ్బాలో **డ**బ్బులు
వేస్తున్నానమ్మా.

మా టీచరు చెప్పారు
**డ**బ్బుల్లు దాచాలని.



**డ**బ్బాలో **డ**బ్బులు
వేయడం ఏమిటీ!



**డ**బ్బా



**డ**మరు

ఈ పదాలు పలకాలి.

| | | | | |
|---|---|---|---|---|
| న**డ**క | ప**డ**క | ప**డ**వ | మీగ**డ** | తలగ**డ** |

కింది చుక్కలను కలపాలి.





# త



తట్టలో తమలపాకులు



తలపై తలపాగ



తలకింద తలగడ



తరగతి



తంబుర

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| తబల | తడక | లత | పీత |

కింది చుక్కలను కలపాలి.

త



# ద



ప్రాణులను
దయతో చూడండి



దంతాలు
చక్కగా తోముకోండి

| | | |
|---|---|---|
|  దండ |  దండం |  దంతాలు |

ఈ పదాలు పలకాలి.

| | | | | |
|---|---|---|---|---|
| గద | దరువు | దవనం | పాదం | వరద |

బొమ్మలు చూసి ఖాళీలను నింపాలి.



గ........



పా........ం

కింది చుక్కలను కలపాలి.





# న



నక్కకూ నత్తకూ పరుగు పందెం,
నంది బహుమతి ఇస్తారు,
ఎవరు గెలుస్తారో చెప్పండి ?



నంది



నక్క



నత్త

ఈ పదాలు పలకాలి.

| | | |
|---|---|---|
| నడక | నలక | నటన |
| నలుపు | జనం | పనస |

కింది చుక్కలను కలపాలి.





పండు, పండు, ఏమి పండు?
పండు, పండు పనసపండు



# ప



పలక, పలక ఎవరి పలక?
పలక, పలక పాప పలక.



పాముపడగ



గాలిపటం



పంటచేను

ఈ పదాలు పలకాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| కలప | గడప | పడక | పడవ | పది | బలపం |

కింది అక్షరాలతో మాటలు రాయాలి.

| | | | |
|---|---|---|---|
| ప | జ | క | ట |
| డ | ఆ | చ | ద |
| న | త | ఊ | గ |

............ ............ ............ ............
............ ............ ............ ............
............ ............ ............ ............

కింది చుక్కలను కలపాలి.





# బ




బజారుకు వెళ్ళాను. బండిలో వచ్చాను.
బంతి కొన్నాను.





బడిగంట కొట్టారు. బడికి వెళ్ళాను.

| | |
|---|---|
|  | బండి |
|  | బడి |
|  | బంతి |




బడినుండి వచ్చాను.
బసవయ్యతో
బంతి ఆట ఆడాను.

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| బడబడ | బరువు | బలపం | రాబందు |

కింది చుక్కలను కలపాలి.

బ 

# మ

మల్లెపూవు తెల్లన
మరువమెంతో పచ్చన
మంకెనపూవు ఎర్రన
చేమంతి పసుపుపచ్చన







మందారం ఎర్రన



వరిమడి పచ్చన



మంట



మంచం



మర

ఈ కింది పదాలలో 'మ' ను గుర్తించాలి.

| | | | |
|---|---|---|---|
| చీమ | తేమ | మామ | విమల |

కింది చుక్కలను కలపాలి.

మ

# య

కాయకాయ
నిమ్మకాయ
నిగనిగలాడే
నిమ్మకాయ





కాయకాయ
మామిడికాయ
రుచులను పంచే
ఊరగాయ



కాయకాయ
కొబ్బరికాయ
అందరుమెచ్చే
టెంకాయ



యముడు



వంకాయ



యజ్ఞం



యతి

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| పాయ | మాయ | పాయసం | భయం |

ఈ కింది అక్షరాలలో 'య' ను గుర్తించాలి.

త య ర య మ ఆ ల య వ ట

కింది చుక్కలను కలపాలి.

య

# ర

రంగు రంగుల రథమండి
రతనాల రథమండి
రండి చూద్దాం రారండి


బరమ


రంపం

ఈ పదాలు పలకాలి.

| | | | | |
|---|---|---|---|---|
| రసం | నరం | కారం | దారం | వారం |

కింది చుక్కలను కలపాలి.





# ల



లలిత చాలా మంచి పిల్ల.
చిలకతో చెలిమి చేసింది.
చిలక చాలా పళ్లు తెచ్చింది.
లలిత చెల్లి గోల చేసింది.

| | | | |
|---|---|---|---|
|  లత |  లడ్డు |  గిలక |  పలక |

'ల' తో ఖాళీలను పూరించాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| .....త | క..... | త..... | ప.....క | జ.....జ | క.....ప |

కింది చుక్కలను కలపాలి.





# వ



వరికోత కోశారు.



వరికుప్ప వేశారు.



వడ్లు దంచారు.



బియ్యం ఎత్తారు.



వల



వడలు



వంతెన

ఈ పదాలు పలకాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| వడ | వంట | వంద | వనం | వనజ | వంకాయ |

కింది చుక్కలను కలపాలి.

వ



# స

సరస్సు పక్కన సన్నజాజి తోట.
సరితా సరళా కలిసి వెళ్లారు.
సన్నజాజి పూలు కోశారు.
సంచిలో వేసుకొని వచ్చారు.



సన్నాయి



సంచి



సబ్బు

ఈ పదాలు పలకాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంత | సగం | సరం | అలసట | సలసల | మీసం |

కింది చుక్కలను కలపాలి.

స





గణగణ గంట
చకచక నడక
పకపక నవ్వు







ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| జడ | పలక | గడప | తడక |
| మడత | వరస | పడక | మడమ |

బొమ్మను చూసి పేరు రాయాలి.





.................... ....................

కింది చుక్కలను కలపాలి.





# ా



రాజా రంగా మాటాడంగా
రామా వనజా ఆటాడంగా
చిటపట చినుకులు రాలుతుండగా
వానపాటలు పాడారు



కాకర



తామర

ఈ పదాలు పలకాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| నావ | పాప | గాలం | జాతర | తాత | పాత |

బొమ్మలను చూసి ఖాళీలను నింపాలి.



..........యు



..........ప



..........న

కింది చుక్కలను కలపాలి.

కా

# ి



కాకి పిలిచింది.
కాకి పాడమంది, ఆడమంది.
పాప ఆడింది, పాడింది.
కాకి ఎగిరింది.
పాప టాటా అంది.



జింక



విమానం

ఈ పదాలు పలకాలి.

| | | | | |
|---|---|---|---|---|
| బడి | బావి | గిలక | మిరప | గిరిజ |

కింది ఖాళీలను నింపాలి.

| | | | | |
|---|---|---|---|---|
| బ...... | బా...... | ......లక | ......రప | ......రిజ |

కింది చుక్కలను కలపాలి.

కి



# ీ



ఈ తీగ బీరతీగ



ఈ చీర ఎర్రచీర



ఈ సీసా పాలసీసా



ఈ పీపా నీళ్ళపీపా

ఈ పదాలు పలకాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గీత | పీత | జీడి | తీపి | చీపురు | వీణ |

కింది చుక్కలను కలపాలి.

కీ



# ు

కుసుమ బడికి నడవసాగింది.
ఆమెకు దాహం వేసింది.
కుండలో నీరు చూసింది.
గ్లాసుతో నీరు తీసుకొని తాగింది.



పులి



తుపాకి

ఈ పదాలు పలకాలి.

| | | | | |
|---|---|---|---|---|
| కుండ | గుడి | పులుపు | బుడగ | గురువు |

ఈ కింది పదాల మొదటి అక్షరానికి కొమ్ముచేర్చి చదవాలి.

| | | | |
|---|---|---|---|
| గ.......డి | క.......ండ | ప.......లి | ప.......లుపు |

కింది చుక్కలను కలపాలి.

కు

# ూ

సూరి రాజూ గూడూరు వెళుతున్నారు.







ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| పూలు | సూది | దూలం | రూపాయి |
| కూర | గూడూరు | గూడు | బూర |

కింది చుక్కలను కలపాలి.

కూ

# ృ



కృప లేక చంపుచుండె
క్రూరమైన మృగరాజు
కృపలేని రాజు చంప
కృషి చేసెను మృగాలన్ని



మృగం



గృహం

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| కృషి | బృందం | వృషభం | హృదయం |

కింది పదాల మొదటి అక్షరానికి 'ృ' ను చేర్చి పలకాలి.

| | | | |
|---|---|---|---|
| గ.....హం | క.......షి | మ.....గం | హ...దయం |

కింది చుక్కలను కలపాలి.

కృ

# ె



మూడు రంగుల జెండా



రెపరెపలాడే జెండా



బెండకాయ



నెమలి

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | | |
|---|---|---|---|---|
| తెలుపు | చెరుకు | పెరుగు | టెంకాయ | గెలుపు |

కింది చుక్కలను కలపాలి.

ె

## ే



అడవిలో ఒక లేడి.



లేడి గెంతుతూ తిరిగింది.





ఆ లేడి మేకను చూసింది. చేరువగా చేరి చెలిమి చేసింది.



గేదె



తేలు



తేనెటీగ

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | | |
|---|---|---|---|---|
| మేక | చేదు | వేపాకు | నేరేడు | జేగంట |

కింది చుక్కలను కలపాలి.

కే గే వే జే టే దే వే

# ై

రైలు గంట మోగింది. రైలు బండి కదిలింది.

రైలు కూత వేసింది.

కైకలూరు దాటింది.

.............తు

.............కిలు

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| మైకు | తైలం | సైకిలు | మైసూరు |

కింది చుక్కలను కలపాలి.

ై





రాముడు, రంగడు పొలం చేరారు.



కొడవలితో పైరు కోశారు.



పొలం పక్క కొలను,
కొలనులో కొంగలు.

| | | | |
|---|---|---|---|
|  కొంగ |  గొడుగు |  బొంగరం |  కొడవలి |

ఈ పదాలు చదవాలి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పొద | దొర | పొగ | తొండ | పొలం | గొలుసు | మొండి |

కింది చుక్కలను కలపాలి.

కొ

# కో



కోడి కొక్కొరొకో అంది.



కోయిల కుహూ కుహూ అంది.



కోతి కిచకిచలాడింది.



గోపి నిద్ర లేచాడు.

ఈ పదాలు పలకాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| చోటు | రోలు | దోమ | గోడ | జోడు | మోటారు |

బొమ్మలను చూసి ఖాళీలను నింపాలి.







..........లు ..........తి ..........డి

కింది చుక్కలను కలపాలి

కో

ౌ



గౌతమి పచ్చ గౌను తొడుక్కుంది.



వీధిలోకి దౌడు తీసింది.



నౌక



గౌను



రౌతు

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌలు | చౌక | టౌను | దౌడు | సౌధం | గౌరి |

కింది చుక్కలను కలపాలి.

కౌ

# ఖ





అందమయిన ముఖం
సొగసయిన నఖం
బరువుమోసే ఖరం
నింగికెగిరే ఖగం

బొమ్మను చూసి ఖాళీలను నింపాలి.

నేలపైన  ........రం

ఆకాశంలో  .......గం

వేలిచివర  న.......ం



ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | | |
|---|---|---|---|---|
| ఖని | సుఖం | శంఖం | ఖండం | ఖలుడు |

కింది చుక్కలను కలపాలి.

ఖ      

# ఘ



ఆకాశంలో మేఘం



నీటితో నిండిన ఘటం



కలసి ఉంటేనే సంఘం



ఘటం



సంఘం

ఈ పదాలు పలకాలి.

| | | | | |
|---|---|---|---|---|
| ఘటన | ఘనత | ఘనం | ఘనుడు | సంఘం |

ఖాళీలను పూరించాలి.

............టం మే........ం

కింది చుక్కలను కలపాలి.

ఘ

# ఛ

పింఛం విప్పింది నెమలి
నాట్యం చూసింది నళిని
వానకురిసింది వడిగా
ఛత్రం విప్పింది నళిని

ఈ పదం పలకాలి.




కింది చుక్కలను కలపాలి.

ఛ



ఝ ఝ ఝ....

# ఝ



ఝషం



ఝరం

'ఝ' అక్షరాన్ని గుర్తించాలి.

నీటిలో ఝషం - తుమ్మెద ఝుంకారం

జలజల పారే ఝరం

కింది చుక్కలను కలపాలి.

ఝ

# ఠ

ఇది మా పాఠశాల.



కంఠం



పఠనం



కమఠం

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | |
|---|---|---|
| మఠం | హఠం | జఠరం |

కింది చుక్కలను కలపాలి.









ఢమఢమ ఢంకా మోగింది
ఢంఢం ఔట్లు పేలాయి
గజగజ పిల్లలు వణికారు



ఢంకా



ఢంఢం

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | |
|---|---|
| గూఢం | గాఢం |

కింది చుక్కలను కలపాలి.





# థ



పాపా ! పాపా ! కథ చెబుతాను.
చందమామ కథ చెబుతాను.



రథం

ఈ పదాలు పలకాలి. చదవాలి.

| | | |
|---|---|---|
| కథ | కథనం | పథకం |

కింది చుక్కలను కలపాలి.

థ

# ధ



సుధ, మాధవుడు ఒకటో తరగతి,
గురువుల బోధన వింటారు.



ధనం



ధనువు

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| ధర | బాధ | రాధ | సాధన |

చదువు తరగని ధనం

కింది చుక్కలను కలపాలి.









# ఫ





ఫణిధరుడు ఫలం చూశాడు,
ఫలంకోసం ఎగిరాడు,
**ఫ**ణి పాకుతూ వచ్చింది,
పారిపోయాడు.



ఫణి



ఫలం



ఫలకం

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | |
|---|---|
| ఫలితం | సఫలం |

ఖాళీలను నింపాలి.

...........ణి ...........లం

కింది చుక్కలను కలపాలి.





# భ



భవనం



భవాని



భరణి



భటుడు

బొమ్మను చూసి ఖాళీలను నింపాలి.



....గ .. .గ మంటలు



దొంగకు.......టుడు
అంటే..........యం.

కింది చుక్కలను కలపాలి.

భ

# ణ



గంట గణ గణ మోగింది.

అరుణ, కరుణ, వీణ గంట విన్నారు.

చక చకా నడిచారు, బడికి చేరుకున్నారు.



బాణం

ఈ పదాలు పలకాలి.

| | | | |
|---|---|---|---|
| గుణం | రణం | లవణం | కణకణ |

బొమ్మలు చూసి పదాలు పూర్తి చేయాలి.



బా.....ం



ర.......ం

కింది చుక్కలను కలపాలి.

ణ 

# ళ







తాళం లేని ఆటాపాటా
వేళా పాళా లేని తిండి
గళం విప్పి పాడని పాట
వద్దండోయ్ వద్దండి


మేళం


తాళం


గంగాళం

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఊళ | కళ | గళం | వేళ | దళసరి | తళతళ |

కింది చుక్కలను కలపాలి.









# శ







శరీర ఆరోగ్యానికి ఆసనాలు మంచివి.



శంఖం



శరం



శశి

'శ' ను గుర్తించాలి.

శనగలు తింటే శరీరానికి మంచిది.

రాధ శనివారం నాడు శనగలు పంచింది.

ఈ పదాలు పలకాలి.

| | | | | |
|---|---|---|---|---|
| ఆశ | దశ | దిశ | కోశం | దేశం |

కింది చుక్కలను కలపాలి.









# ష





ఉష మిషను కుడుతున్నది.
గోపి పులివేషం వేశాడు.
ఉష భయపడింది.
గోపి వేషం తీసి నవ్వాడు.



మేషం



వేషం

ఈ పదాలు పలకాలి.

| | | | | |
|---|---|---|---|---|
| మిషను | దోషం | రోషం | విషం | ఉష |

కింది చుక్కలను కలపాలి.

ష

# హ






హంస



హలం



హరిణం

ఈ పదాలు పలకాలి.

| | | |
|---|---|---|
| ఊహ | హయం | దాహం |

ఖాళీలను నింపాలి.

............ంస ............లం

కింది చుక్కలను కలపాలి.

హ 

గ్గ

ౘ



పాలబుగ్గల పసిపాప



కుచ్చుల జడ ముచ్చట



ముంగిట ముగ్గు
ముచ్చట గొలుపు

ట్ట

డ్డ



చెట్టుమీద పిట్ట



బిడ్డచేతిలో లడ్డు

జ్జ



బ్బ

సజ్జ చేలో బుజ్జి మేక



ఇది గజ్జెల మొలతాడు



దుబ్బు చాటున బెబ్బులి

క్క



త్త

పెంపుడు కుక్క



కొత్త కత్తెర



పత్తి చేలో కొత్తగిత్త

న్న

మ్మ



గిన్నెలో జున్ను ముక్క



అమ్మ ఒడిలో తమ్ముడు

య్యా

్ర



నూతి మీద కొయ్య గిలక



మఱ్రి తొఱ్ఱలో
బుఱ్ఱు పిట్ట



ఉయ్యాల ఆటకు ఊడల మఱ్రి

ప్ప

ద్ద



నిప్పు ముట్టవద్దు
ముప్పు తెచ్చుకోవద్దు
హద్దు మీర వద్దు
అప్పు చేయ వద్దు

స్స

కస్సు బుస్సు లాడవద్దు

ళ్ళ



విస్సన్న బస్సు మీద
వచ్చాడు.



గుళ్ళో పెళ్ళికి వెళ్ళాడు.

| ల్ల | | వ్వ |
|---|---|---|





బల్లమీద పిల్లి
తల్లి ఒడిలో పిల్ల

అవ్వ చేతి బువ్వ
రవ్వ లడ్డు తీపి

| ణ్ణ | శ్శ | | ష్ష | హ్హ |
|---|---|---|---|---|



కర్ణం



వర్షం

అర్హత - స్పర్శ



# భయమెందుకు ?

భయమెందుకే పాప బడి అంటె నీకు ?
ఆటపాటలతోను ఆడిస్తారు
బొమ్మలెన్నో తెచ్చి చూపిస్తారు
బొమ్మ బొమ్మకు పేరు పలికిస్తారు
పేరు పేరున చెప్పి రాయిస్తారు
రాతలన్నీ కలిసి మాటలవుతాయి
మాటలన్నీ కలిపి పాఠమవుతుంది
పాఠాన్ని గుర్తెరిగి వల్లె వేస్తావు
ఆడుతూ పాడుతూ అప్పగిస్తావు
భయమెందుకే పాప బడి అంటే నీకు !

# అంకెల పాట

ఒకటి ఒకటి ఒకటి
మనుషులమంతా ఒకటి 1

రెండు రెండు రెండు
మంచిచెడులు రెండు 2

మూడు మూడు మూడు
మన జెండా రంగులు మూడు 3

నాలుగు నాలుగు నాలుగు
ఆవుకు కాళ్ళు నాలుగు 4

ఐదు ఐదు ఐదు
చేతికి వేళ్ళు ఐదు 5

ఆరు ఆరు ఆరు
ఋతువులన్నీ ఆరు 6

ఏడు ఏడు ఏడు
వారానికి రోజులు ఏడు 7

ఎనిమిది ఎనిమిది ఎనిమిది
దిక్కులు మూలలు ఎనిమిది 8

తొమ్మిది తొమ్మిది తొమ్మిది
గ్రహాల కూటమి తొమ్మిది 9

పది పది పది
పాపలు పాడే పాట ఇది 10

# అక్షరమాల

అ ఆ ఇ ఈ ఉ ఊ

ఋ ఎ ఏ ఐ

ఒ ఓ ఔ అం అః

క ఖ గ ఘ ఙ

చ ౘ ఛ జ ౙ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ల ళ వ

శ ష స హ



# తెలుగు భారతి

ఒకటవ తరగతి వాచకం